దీనినిబట్టి ఈప్రతివాదులకు, తాము విమర్శించినతరువాత నచిరకాలములోనే నేత్రవ్యాధి యంకురించినదనియు, దానిఫలమే యిది యని లోకులనియున్నారనియు, దానిని తృణీకరించి మరికొన్నినూతనాంశములు చేర్చి పునర్ముద్రణము జరిపించినారనియు స్పష్టము తరువాత వీరే 1938క్రీసంవత్సరములో రాజసూయరహస్యమును వ్రాసియున్నారు. అందు 'కృతిసమర్పణము— స్వచరిత్రము' అనుపేరుతో గ్రీషద వ్రాసియున్నారు అదిట్లున్నది—

'సంధిల్లె నంధత సంధిల్లె నప్పు,
సంధిల్లె నేకత,సంధిల్లె జింత
సంధిల్లె దీనత సంధిల్లె భీతి
సంధిల్లకున్నది సంతుష్టి సుంత,
సిద్ధింపకున్నది చిత్తసంశుద్ధి.
సిద్ధింపకున్నది శ్రీశ నీసేవ
ఇట్లు తాకట్టించి యిప్పుడు కాలమును
మెల్లగా గడపుదు మెరమెరతోడ
మడిమాన్యములు లేవు మనువెట్లు గడచు
కడదశలో నని కళవళపడుదు
[illegible]న [illegible]ాకంథత యధికమౌచుండ,
బోనెట్లు సమకూరు పొరుగూరి కటట
ముందెట్లు జరుగును ముప్పున నెట్లు?
సందేహభయములు సమకూరె దేవ' అని.

ఆహా అంత మహాభారతచరిత్రమును వ్రాసియు, అంత విమర్శకపదవి నధిష్ఠించియు, అంతసాహసమున కొడిగట్టి సత్యమిదియే యని ప్రకటించియు, అంతవ్యాసభగవానుని దూషించియు, అంత దుర్యోధనాదుల నభినందించియు అంత పాండవుల నిందించియు, అంత ద్రౌపదీదేవిని దూషించియు, అంత శ్రీకృష్ణపరమాత్మను నిందించియు

రాజనూయరహస్యము వ్రాయునప్పటికి మ.భా చ కారుల జీవితమున కింత మార్పు రానా? అంధత్వాదులు సంభవిల్లనా? చిత్తశుద్ధి లేకుండ బోనా? మను వెట్లు గడచు నని కళవళపడనా? అంధత్వ మధికమై పోనా? ముందు ముప్పెట్లు గడచు నని భయపడనా? ఏమి దైవవిలాసము పాపము వీరికి అర్థలాభము లేకపోగా అనర్థపరంపరాప్రాప్తి మైనదన్నమాట, ఈయనర్థప్రాప్తికి మూలము 'యదన్తరం చ జ్ఞాయతేత త్తజ్జన్యమ్' అనున్యాయమున వీరి మహాభారతచరిత్రరచనయే కావలసియున్నది ఒకదుష్కార్యము చేసినతరువాత వచ్చెడి ఫలము ననుభవించుచు నిది యాదుష్కార్యఫలితమే యని యాస్తికు డెరుగును. తన యనుభవమునకును, తానుచేసిన దుష్కార్యమునకును సంబంధము లేదని నాస్తికు డనుకొనును అట్లనుకొనినను ఆ నాస్తికునకు ఫలానుభవము తప్పనిదే. మ. భా. చ కారులు చేసిన మహాపురుష దూషణము సామాన్యమా? మహావైరియగు శిశుపాలుడుకూడ జేయ లేనట్టి శ్రీకృష్ణనిందలను వీరు చేసినపుడు అవి యూరకపోవునా?

కనుక మ భా చ కారులచే గంరోక్తిగా జెప్పబడిన స్వచరిత్రాంశములలో పూర్వోత్తరములను బాగుగా తెలిసికొని లోకులు-వ్యాసమహర్షి, పాండవులు ద్రౌపది, భీష్ముడు, శ్రీకృష్ణపరమాత్మ, మున్నగు మహావ్యక్తులయందు భక్తిశ్రద్ధలు కలిగి, వేదవ్యాసమహాభారతోక్తము సత్య మని గ్రహించి, వినుర్శకోక్తుల దిరస్కరించి యిహపరసుఖముల నొందుగోరుచున్నాము

బాలవ్యాస' న్యాయ వ్యాకరణ వేదాంత విద్యాపారీణ'
వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిప్రణీతమైన
మహాభారతతత్త్వకథనమున "శ్రీకృష్ణనిందానిరాకరణ"
మను తృతీయభాగము
సంపూర్ణము.

[illegible]థమ, ద్వితీయ, తృతీయ భాగములు విక్రయమునకు [illegible]న్నవి. రాబోవుభాగము— పాండవనిందానిరాకరణము.

గ్ర[illegible]ప్తిస్థానము: —

వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు,
పి ఠా పు ర ం,
తూర్పుగోదావరిజిల్లా.